Registered No. M-4484

# యుద్ధ సంచిక

వాల్యుం II.] 1942 వ సం॥ సెప్టంబరు నెల 25 వ తేది శుక్రవారం [నె 38 రు.



**"జనరల్ లీ"**

30 టన్నుల బరువు, ఒక 3" ఫిరంగి, ఐదు మరఫిరంగులుగల బరువైన క్రూయిజరు టాంకులు అమెరికాలో తయారయినవి. ఇంగ్లాండులో శిక్షణ పొందుచున్న కనడా సైనికులు వీటిని సాధన చేయుచున్నారు. అమెరికా సేనానాయకుని పేరు వీటికి పెట్టిరి.

## యుద్ధ విమర్శ.

### ఇండియా సమస్య - యూరోపియనుల వైఖరి - స్టాలినుగ్రాడులో ప్రతియింట యుద్ధం - జర్మనీ వ్యూహం.

**స్టాలినుగ్రాడులో సంకుల సమరం.**

స్టాలినుగ్రాడు రక్షకులు యుద్ధరంగం అంతట విజృంభించి కొన్నిచోట్ల ముందుకి పోగల్గిరని మాస్కో వార్త తెలుపుచున్నది. స్టాలినుగ్రాడు నగరంలో ప్రతి యిల్లు, ప్రతి గది ఒక యుద్ధరంగమయినదని మాస్కో రేడియో తెలుపుచున్నది. మేడలమెట్లు జర్మను శవాలతో నిండియున్నవి. వీధులలో సంకుల సమరం జరుగుచున్నది.

> "స్టాలినుగ్రాడులో ప్రతి యిల్లు ఒక కోటగా మారినది. నగర పరిసరములందు సిమెంటు గోడలు, మందు గనులు, ఫిరంగి కేంద్రాలు మామూలు ముళ్లతీగల నిరోధాలు కట్టబడి నగర ద్వారాలు కాపాడబడుచున్నవి. లోన రష్యను సైన్యం చావుకి తెగించి నిలచియుంది. ఇది రష్యా ప్రచార వాక్యాలవలె నుండును. కాని నేడు బెర్లినునుండి యీమాటలే వినవస్తున్నాయి" అని స్టాకుహోము రేడియోనుండి ఒకరు చెప్పిరి.

ఎర్రసైన్యం పత్రికయగు రెడుస్టారులో యిట్లు గలదు :—సివిలు ప్రజల జీవితం చెడవచ్చును గాని, నగర రక్షణ చెడదు. పడిన యిండ్లలోనే నిర్నిరోధమగు రక్షణ శిబిరాలు కట్టవచ్చును.

త్వరలో నగరం పడిపోతుందేమో అన్నట్లు కొన్నివార్తలు, వెంటనే రష్యనులు గెలుస్తున్నారని కొన్నివార్తలువస్తూవుంటాయి. ఇది చిత్రంగానుంటుంది. దీనికి కారణం, జర్మనులు సన్నని మార్గం ఒకటి పట్టుకొనుటకు విశ్వప్రయత్నంచేసి, ఉన్నసైన్యం సరకు అంత వినియోగించి, తిరిగి క్రొత్త సేన తెచ్చి నష్టం పూర్తిచేసుకొనేవరకు ఊరుకుంటారు. ఆ సమయంలో రష్యనులు తిరుగుదాడులు చేస్తూవుంటారు.

**వ్యవధికై పోరు.**

వారం రోజుల క్రిందట జర్మనులు మైళ్ల గెల్చుకుంటూవుంటే, యిపుడు గజాలు గెలుస్తున్నారు. రష్యనులు చాల చిక్కులో పడ్డారు, నిజమే. కాని రష్యను రక్షణవిధానం నేటిస్థితికి వచ్చినను అకస్మాతుగ కృంగిపోదు. మాస్కోవలె విజయంపొందవచ్చు, సిబాస్టపూలులోవలె ఓడిపోవచ్చును, గాని నిరోధంమాత్రం మానవశక్తితో పోరగల్గినంత సేపు జరుగుచునే యుండును. స్టాలినుగ్రాడు యుద్ధ ఫలితం ఆ నగరంలోకాక వెలుపల

దూరాన నిర్ణయింపబడునని చెప్పవచ్చును. రష్యా సేనలో ప్రధానభాగం ఆ నగరంలో లేదు, ఉత్తరాన వోల్గానది వంపులో పాంజారు (టాంకు) డివిజనులో గలదు. అందుచే నగరాన్ని రక్షించు చున్నవారు కొంతకాలం యింకను లొంగిపోకుండ శత్రుదాడిని నిరోధించ గల్గినచో టిమొషెంకో సేనాని తనసేనను దిగువకు నడిపి, డానువాల్గా నదులమధ్య వానుబాకుగారి సైన్యానికి ఎడమవైపు గావచ్చి కొట్టును. అక్కడ నీరసగానున్నందున జర్మనులు అపుడే తత్తరపడుచున్నారు. టిమొషెంకోగారి తిరుగుదాడి వచ్చేవరకు స్టాలినుగ్రాడు నిలచియుండునా యన్నది రష్యను సేనల దారుఢ్యముపైని, జర్మను విమానశక్తిని తగ్గించుట పైని ఆధారపడియుండును స్టాలినుగ్రాడు పడిపోకుండా నిలచినచో జర్మనుల 1942-43 వ సం॥ ప్లానంతా విఫలమగును. స్టాలినుగ్రాడు పడినచో, వానుబాకుగారి విశేషసైన్యం రెండు మూడువేల టాంకులు, అనేక విమానాలు యింకో చోట యుద్ధానికి తయారవతాయి

కాకసను యుద్ధం

కాకసను రాష్ట్రానికి ఉత్తరమార్గాలను చేజిక్కించుకొనుటకు స్టాలినుగ్రాడు జర్మనులకు అవసరం. డాను, వాల్గా, టెరెకు, కుబను నదుల మధ్య ప్రదేశమంతా వశపరచుకొనుటకై ముందుగ జర్మనులు ఉత్తర కాకేషియాపై బడిరి. ఆ వూపున వారు నల్లసముద్రానికి వచ్చి నవరోసిస్కు నౌకాశ్రయం ఆక్రమించిరి. అందువలన వారికి కాంస్టాంజానుండి కాకేషియాకు సరాసరి సముద్ర మార్గం లభించింది. కాని రష్యను నల్లసముద్ర నౌకాదళమును పూర్తిగ నిర్మూలంచేయంది వారికీ మార్గం ఉపయోగపడదు నవరోసిస్కు పోయినా నల్లసముద్రం రేవులు టాప్సి, సుక్కుం, పోటి, బాటూములు రష్యనులకు గలవు. జర్మనులు కాకేషియా పర్వతాల పడమర కొననుండి దక్షిణమున బాటూంవరకు సముద్రతీరానవున్న రోడ్డు ననుసరించి త్రోసుకరాగలరా యన్నదే సందేహం. ఈ మార్గంలో అనేక కొండలు, టన్నెల్సు వంపులు ఎగుడుదిగుడు మార్గాలు కలవు. కనుక అక్షరాజ్యాల సైన్యానికి కష్టసాధ్యమేగాని అసాధ్యంకాదు. బాటూం వారి వశమయినచో కాకేషియా అంతటి నాక్రమించుటకు సముద్రంపై సేనలే రప్పించబడును. అయితే బలవత్తరమగు రష్యను సేనలును, భారతీయ 9 వ సైన్యము వారిని నిరోధింపగలవు.

ఇంకో అక్షరాజ్యాల దాడి రోస్టావు నగరం నుండి గ్రాజ్నీ చమురు గనుల వరకునుండును అటనుండి కాస్పియను సముద్రం ఒడ్డునఉన్న మజాచి వరకు నుండును ఈ ప్రాంతంలో తీవ్ర యుద్ధం జరుగవచ్చును కాకేషియా రాష్ట్రమంతా జర్మనులు వశపరచుకొనుట, అది పర్వత ప్రాంతమగుటచే కష్టసాధ్యం కాని ఉత్తర కాకేషియానుండి రష్యాకుపోవు మార్గాలన్ని వశం చేసుకొని రష్యాకు చమురు సప్లయిపోకుండా చేయుటకు వారు ప్రయత్నిస్తున్నా రనవచ్చును. కాస్పియను సముద్రతీరాన దక్షిణమునవున్న బాకూ రేవులనుండి ఉత్తరాన ఆస్ట్రిఖానువరకు సముద్రమార్గంకాని, నేలమార్గంకాని లేకుండా చేయ యత్నిస్తున్నారు.

కాని స్టాలినుగ్రాడు వారికి వశం కాకపోతే యీ కాకేశియా వ్యూహం అంతా విఫలమగును, ఎర్ర సైన్యాన్నిపూర్తిగ నాశనంచేయడానికి నిరుడు మాస్కోపై దండెత్తినట్లే, యిపుడు జర్మనులు కార్కోవునుండి స్టాలినుగ్రాడు వరకు 500 మైళ్లు దాడిచేసిరి. స్టాలినుగ్రాడు యుద్ధం ప్రత్యేకమయినదికాదు రష్యను-జర్మను సేనలకు 15 నెలల నుండి జరుగుచున్న యుద్ధంలో భాగమే. చచ్చేవరకు కొనసాగించే యుద్ధమే.

* * *

క్రిప్సు సూచనలు స్వరాజ్యమే

భారత కేంద్ర శాసనసభలో గత శుక్రవారం నాడు ఇండియా ప్రభుత్వ న్యాయశాఖ సభ్యులగు సర్ సయ్యదు సుల్తాను మహమ్మదు గారు, ఇండియా సమస్యగూర్చి బ్రిటిషు ప్రభుత్వంవారు నిర్మాణయుతమగు సూచన లేమియు చేయలేదను విమర్శలకు బదులుచెప్పిరి. దేశంలో తిరుగుబాటు యింకా చెలరేగుచున్న యీ సమయమున యీ విమర్శ వచ్చుట ఆశ్చర్యకరంగా నుండనియు, తిరుగుబాటుదారులు అత్యాచారములు చేయుచుండగా ప్రభుత్వంవారు రాజ్యాంగ నిర్మాణంగూర్చి ఆలోచిస్తూ కూర్చుంటారనుకోడం సహేతుకం కాదనిరి. వారింకను యిట్లు దెలిపిరి —

"అంతేకాక, క్రిప్సుగారి సూచనలు యిప్పటికైనను అంగీకరింపవచ్చును అవే బ్రిటిషు ప్రభుత్వం వారు సూచించిన నిర్మాణయుతమగు సూచనలు. దురదృష్టవశాత్తు అవి త్రోసివేయబడ్డాయి. ఈ సూచన లంగీకరించియుంటే "స్వరాజ్యం" వచ్చినట్లే, యని నా అభిప్రాయం. ఇండియా కోరుచున్న స్వరాజ్యం అటువంటిదే. కాని

వైస్రాయిగారికి నిరాకరించే అధికారం ఉందను కారణంచే అవి నిరాకరించబడెను కాంగ్రెసు కోరిన సాంప్రదాయం, ప్రజా ప్రతినిధుల బలం గల ప్రభుత్వవర్గ మేర్పడినపుడు, దానంతట నదే పుట్టి పెరుగును గాని, సాంప్రదాయాలు చట్టంలో పేర్కొనబడవని గుర్తింపకున్నారు. కన్వెంషన్సు అనునవి చట్టంలోనో ఒడంబడికలలోనో పేర్కొనబడగనే అవి నియమ నిబంధన లనిపించుకుంటాయి గాని సాంప్రదాయా లనిపించుకోవు ”

ఇంగ్లాండులోని ప్రధాన మంత్రి, తన మంత్రుల నెంచుకొనుట, పార్లమెంటరీ కాబినెటు విధానం యివన్నిగూడ సాంప్రదాయసిద్ధంగా అనుసరింపబడుచుండిన పద్ధతులుగనే ప్రారంభమయినవిగాని, చట్టంలో శాసింపబడినవికావని సర్ సుల్తాను అహమ్మదుగారు తెలిపిరి

**యూరోపియనులు బ్రిటను వాగ్దానము**

కేంద్ర శాసనసభయందు యూరోపియను సభ్యుల నాయకుడగు సర్ హెన్రీ రిచర్డ్సనుగారు ఇండియాలో యూరోపియనుల వైఖరినిగూర్చి తెలిపిరి వారు సెప్టెంబరు 15 వ తేదీ ఉపన్యాసంలో ఇండియాకు స్వాతంత్ర్యం వాగ్దానం చేయబడిందనియు, తమ యూరోపియను సంఘంవారు ఆ వాగ్దానాన్ని అమలు జరుపుటకు అన్నివిధముల తోడ్పడెదమనియు చెప్పిరి

ఇండియా రాజ్యాంగ విషయమగు ఒడంబడికయందు యూరోపియనుల వాణిజ్య హక్కుల గూర్చిన హామీలేమి చేర్చబడవని బ్రిటను యిదివరకే స్పష్టంగా తెలిపియుండెను. కామన్సు సభలో ఇండియా మంత్రి అమెరీగారు ఏప్రిలు 28 వ తేదీన యిట్లు తెలిపియుండిరి ——

“ యుద్ధానంతరం భారతీయులు ఎటువంటి రాజ్యాంగ విధానం నిర్ణయించుకొన్నను అది అంగీకరించుటకు, ఇండియాలో బ్రిటిషు వాణిజ్యహక్కుల గూర్చిన హామీలుండాలను షరతు విధించబడదని బ్రిటిషు ప్రభుత్వంవారు స్పష్టంగా తెలుపుచున్నారు అట్టి హామీ లేమయిన కావలిస్తే భావి భారతీయ ప్రభుత్వంతో రాయబారాలు నడుపుకోవచ్చును ”

కావున అటువంటి హామీ యేమిలేకుండానే కేంద్ర శాసనసభలో యూరోపియను పక్ష నాయకుడు పైవిధంగా తెల్పుటవలన, బ్రిటను చేసిన యుద్ధానంతర స్వాతంత్ర్య వాగ్దానమును యూరోపియనులు పూర్తిగ బలపరస్తున్నారని రూఢియైనది.

14

# భారతీయ నౌకాదళం.

## ఉద్యోగుల వేతనాభివృద్ధి.

రాయలు ఇండియను నేవీ (నౌకాదళం) లోని కమిషను ఉద్యోగులకు, వారంటు ఉద్యోగులకు వచ్చే అక్టోబరు నెల 1 వ తేదీనుండి జీత భత్యాలు ఎక్కువగును. సామాన్య నావికులు సైనికులగు రేటింగుల వేతనాలు యీసారి ప్రారంభంలోనే వృద్ధిచేయబడ్డాయి.

కమిషన్డు ఉద్యోగులందరికి ముఖ్యమగు సౌకర్యాలు మూడు విధాలుగ నుంటాయి .——

వివాహితులకు జీతంలో నూటికి 10 వంతున, ఒంటరిగా నుండువారికి 5 వంతున తీసుకొని ప్రభుత్వంవారి యిండ్లలోనే వారికి బస యివ్వబడును.

స్వదేశం వెలుపల పనిచేయు వారందరికి ఓవర్సీసు అలవెన్సు యివ్వబడును.

ప్రస్తుత నియమాల ప్రకారం నౌకాదళం ఆఫీసరులు నావలపైనుండక, తీరాన పనిచేయుచుండినచో ఎక్కువ అలవెన్సు గైకొనుచుందురు. వచ్చే నెలనుండి అందరు ఆఫీసరులు ఎక్కడనున్నా క్రొత్తరేటు జీతాలు గైకొందురు తీరపు అలవెన్సు ఎత్తివేయబడింది. ఎక్కడ పనిచేస్తున్నా స్థిరమొత్తం లభించును దీనివలన నావలపై పనిచేయుచున్న ఆఫీసరులకు జీతం హెచ్చును సబు లెఫ్టునెంటు బ్రహ్మచారి అయిన రూ 455 లు తక్కువ కాకుండాను, వివాహితుడైన రూ 515 లు తక్కువకాని జీతం పుచ్చుకొనును. లెఫ్టనెంటులు రూ 530 లు, రూ 590 లు తక్కువకాకుండా జీతాలు పుచ్చుకుంటారు ఇకముందు ఇంజనీరింగు మున్నగు శాఖ లన్నింటియందు ఉద్యోగులకు ఒకేరకం జీతం ఉండును.

వారంటు ఆఫీసరులు అన్ని శాఖలలోనివారి జీతాలు రాయలునేవి వారంటు ఆఫీసరులతోపాటు సరిసమానం చేయబడినవి ఇపుడు రూ 130 లు జీతంగల వారికి యికముందు రూ 300 లు లభించును ఇండ్లు, వివాహం, భోజనం, ఎడబాటు అలవెన్సులుగూడా ఉండును

క్రొత్త జీతం నిబంధనలు కమిషన్డు, వారంటు, రిగ్యులర్, రిజర్వు ఉద్యోగులందరికి వర్తించును. ఆఫీసరులు యిష్టమున్నచో ప్రాత జీతాలనే పుచ్చుకొనుటకు ఆక్షేపణలేదు.

# మడగాస్కరు ఇండో-చీనావలె కాకూడదు.

మడగాస్కరులో యిపుడు జరుగుచున్న పని నాలుగు నెలల క్రిందట ఎందుకు జరుగలేదని తప్ప, అసలెందుకు ఇంగ్లీషు వారాక్రమిస్తున్నారని ఎవరికి ఆశ్చర్యముండదు. శత్రువే ఆదీవిని ఆక్రమిస్తే ఆఫ్రికానుండి ఇండియాలో తూర్పు కనుమలవరకు వ్యాపించియున్న మన సైనిక వ్యూహమునకు తగని హానికలిగించగల్గును. కేపుటవును చుట్టివచ్చు సముద్ర మార్గము అట్లాంటికు సముద్రమార్గాల తరువాత ప్రాముఖ్యతయందు రెండో స్థానం, ఆక్రమించును ఆ మార్గమును రక్షించుకొనుట సంయుక్త రాజ్యాల వ్యూహమునకు ఎంతో అవసరం. ఈ ప్రాంతంలో శత్రువును అరికట్టి యుంచుటేగాక వెనుకకు తరిమివేయుట చాల అవసరము. కనుక యిచట ఆలశించి ప్రయోజనంలేదు. కావున మే మాసంలో ప్రారంభించిన కార్యము, విఫలమయిన రాయబారాలతో కొంత ఆలశ్యమయినను, యిపుడు పూర్తియై ప్రమాదం పూర్తిగ తొలగిపోగలదు.

అబిసీనియాలో మంచి అనుభవంకలిగిన లెఫ్టనెంటు జనరలు సర్ విలియం ప్లాటుగారు యిచట సైన్యాధిపత్యం వహించిరి. వీరు సత్వరంగా ఖచితంగా పనిచేయగలరు, ఇంతవరకు నిరోధం నష్టం చాల తక్కువయుండెను. మడగాస్కరు ఫ్రాంసుకన్న కొంచెం పెద్దది, రోడ్లు మార్గాలు తక్కువ. ఇచట త్రోసుకొని పోవుటకు ప్రతికూలుర నిరోధంకన్న రాజకీయ మీమాంసలే ఆలశ్య కారణములు కావచ్చును.

### ధర్మకర్తలవలెనే

బ్రిటను, దక్షిణాఫ్రికాలిచట కార్యభారం వహించుచున్నవి. వారి చర్యకు సంయుక్త రాజ్యములన్నింటి ఆమోదంకలదు. బ్రిటిషువారు "దోపిడి" చేయుచున్నారని జపాను; చెప్పరాని దురాక్రమణ చేస్తున్నారని విషీప్రభుత్వం; ఇతరులకు నీతులు చెప్పడంలో పెద్దదగు జర్మనీ "ఇతరుల హక్కులకు భంగం కలిగిస్తున్నా"రనియు, బ్రిటిషువారిని నిందిస్తున్నారు ఈ బుడుబుడు శోకాలు ఎవ్వరికీనచ్చవు విషీప్రభుత్వం క్రిందనున్న మడగాస్కరు తటస్థంగా నుండునను కోడమేగాని, బ్రిటిషువారు అందు ప్రవేశించక పూర్వము తరువాతగూడ జపాను ఆ తాటస్థ్యాన్ని దుర్వినియోగపరచింది, జర్మను ఏజెంటులు అక్కడ ఉండనేయున్నారు ఇండో-చీనాను జపాను ఆక్రమించినట్లే మడగాస్కరునుగూడ ఆక్రమించదలచి అన్ని కుతంత్రాలు చేసింది. ఫ్రాంసు గౌరవాన్ని స్వదేశంలోగాని తన సామ్రాజ్యంలోగాని కాపాడే ఉద్దేశం తనకున్నట్లు విషీ ప్రభుత్వం ప్రయత్నించలేదు. (మడగాస్కరు విషీ పరిపాలన క్రిందనున్నది) దానికా ఉద్దేశం వున్నా కాపాడేశక్తి లేదు. కావున మడగాస్కరును స్వతంత్ర ఫ్రాంసు దేశానికి తిరిగి ఒప్పగించుటకు ధర్మకర్తలుగ బ్రిటను దక్షిణాఫ్రికాలు మడగాస్కరును ఆక్రమిస్తున్నాయి. ఫ్రాంసులోనున్న స్వాతంత్రాభిలాషులందరు బ్రిటిషువారి సైనిక చర్యను తప్పుగా అర్థంచేసుకోరు, అంతకన్న బ్రిటిషువారి వాగ్దానమును నమ్మకపోరు.

---

**జపాను కృతజ్ఞత చూడండి**

"భవిష్యత్తు" అను అమెరికా మత విషయకమగు మాసపత్రికలో 1942 జూను సంచికలో జపానుగూర్చి యిట్లు గలదు —

ఇదివర కొకసారి జపాను దీవులందు కనివిని ఎరుగనంత భూకంపంవచ్చి వందల కొలది ప్రాణాలుపోయి, ఆస్తి విశేషంగా నష్టపోయినపుడు అమెరికాదేశం 100 లక్షల డాలర్లు జపానుకి పంపింది జపాను ప్రభుత్వం అందుకు కృతజ్ఞత తెల్పుచు పంపిన కేబిలు వార్తలో "జపాను ఎన్నటికి మరచిపోదు." అని గలదు.

ఇపుడు పెర్లు హార్బరుపై దాడిచేయుటతో జపాను ఆ "కృతజ్ఞత" జూపింది.

# జపాను నావల జలక్రీడలు.

ఈ మహాసంగ్రామంలో జర్మనీతో జపాను కూడాచేరి, తనకు కావలసిన రాజ్యాలను తాను జయించి, ఆక్రమించుకోవలెననే సంకల్పంతో బయలుదేరింది జర్మనీతో జపానుచేరి యుద్ధం చేయుచున్నప్పటికీ, ఈ రెండు రాజ్యాలకున్నూ తూర్పు పడమరలకు ఉన్నంత భేదంఉంది జపాను తూర్పుదేశం, జర్మనీ పడమటి రాజ్యం జర్మనీ రాజ్యంలోని ప్రజలు తెల్లజాతులవాళ్లు— జపాను రాజ్యంలోని ప్రజలు పసుపురంగు జాతి వాళ్లు. జర్మనులందరూ క్రయిస్తవ మతస్థులు— జపానువాళ్లు బౌద్ధ మతస్థులు—అన్నింటికన్నా ముఖ్యమైన వ్యత్యాసం ఏమిటంటే, జర్మనీకి విశేషంగా సముద్రతీరంలేదు. జపాను రాజ్యం నలువైపులా సముద్రముగల లంక ఈ కారణం వల్ల, జర్మనీకి ఎక్కువ యుద్ధనావలుగాని, గొప్ప నౌకాదళంగాని లేదు జపానుకుమాత్రం విశేషంగా యుద్ధ నావలు ఉన్నాయి చెప్పుకోదగిన పెద్ద నౌకాదళం ఉన్నది అందువల్ల జపానువాళ్లు సముద్రంమీద యుద్ధంచేయుటకు తమ నౌకాబలంతో తరచు తయారవుతూ ఉంటారు

జపానువాళ్లు యితరుల రాజ్యాలు జయించవలెననే ఆశతో జర్మనీ పక్షంలోచేరి యుద్ధంలో దిగేరు జర్మనీవాళ్లు ఎంత యుద్ధమైనా మెట్టమీద ధైర్యంగాచేస్తారు కాని, సముద్రంమీదకు యుద్ధ నావలతోవచ్చి సముద్ర సమరం చెయ్యడంమాత్రం జర్మనీకి గిట్టని చేదుమాత్రవంటిది నీటిలోనికి రాకుండా మెట్టమీదనే హిట్లరు తన ప్రతాపం యావత్తు చూపిస్తానంటాడు కారణం ఏమిటయ్యా అంటే, జర్మనీకి విశేషమైన నౌకాబలంలేదు. పెద్దసైజు యుద్ధ నావలులేవు ఒకటి రెండు యుద్ధనావలు ఉన్నప్పటికీ, వాటిని పోగొట్టుకుంటే, జర్మనీకి గల సముద్రబలం సర్వ నాశనమైనట్లే అప్పుడు తూర్పుకు తిరిగి నమస్కారం చెయ్యవలసిందే జర్మనీకి ఉన్నటువంటి యుద్ధ సామర్థ్యం ఎక్కువగా ఎందులో ఉన్నదయ్యాఅంటే, టాంకులలోనూ, విమానాలలోనూ ఉన్నది. టాంకులు అనేవి ఫిరంగులతో అమర్చబడిన ఉక్కురేకుతో నిర్మించబడిన మోటార్లు ఇవి మెట్టమీద మాత్రమే నడువగలవు. ఇవి నీటిమీద నడిచేవి కావు ఇటువంటి టాంకులను హిట్లరు విశేషంగా సమృద్ధిగా నిర్మించి సిద్ధపరచుకొన్నాడు ఈ టాంకులు ఫిరంగులను కాల్చుచూ యుద్ధరంగములో నిర్భయంగా ముందుకుపోతూ ఉండుటకై, పైన ఆకాశంలో విమానాలుకూడా ఎగురుతూ అంగరక్షగాఉండి, శత్రువులు ఉండే ప్రదేశాలమీదకు ఆ విమానాలు వెళ్లి ముందుగానే బాంబులు వేస్తూఉంటాయి కనుక, విమానాలనుకూడా విశేషంగా హిట్లరు నిర్మించి సిద్ధపరచుకొన్నాడు ఈ విమానబలంతోను, యీ టాంకు బలంతోను, హిట్లరు సాగించే యుద్ధం సముద్రం మీద సాగేదికాదు మెట్టమీద మాత్రమే మేటి బంటునని తిరుగగలడు నీటిమీదకువచ్చి యుద్ధం చెయ్యడంఅంటే, హిట్లరుకు భయం. వంటినిండా బొచ్చుగల కుక్కను నీటిలోకిలాగితే, అది ఎంత భయపడి పారిపోతుందో హిట్లరు కూడా అంత భయపడతాడు. సముద్రం దాటి ఇంగ్లాండువంటి రాజ్యంమీదకు దండెత్తవలెనంటే, హిట్లరుకు యమలోక యాత్రవంటిదే కారణం ఏమిటంటే, జర్మనీకి పెద్ద యుద్ధ నౌకాదళం ఏమిన్నీ లేదు

అయితే, జపానుకు ఉన్న బలమేమిటో చూడాలి జపానుకు యుద్ధ నావలు, అనగా ఒకటో రకం పెద్ద యుద్ధనావలు కొన్ని ఉన్నాయి. 30 వేల టన్నుల ప్రమాణంగలవి సామాన్యంగా పెద్ద యుద్ధ నావలుగా లెక్కలోకి వస్తాయి ఇటువంటివి సుమారు 10 లేక 12 పెద్ద యుద్ధనావలు జపానుకు ఉన్నట్లుగా లెక్కతేలినది వీటిమీద చాలా పెద్ద సైజు ఫిరంగులు ఉంటాయి 14 అంగుళాల వెడల్పు మూతిగల ఫిరంగులు మాత్రమే కాకుండా 16 అంగుళాల ఫిరంగులుకూడా ఉంటాయి ఇటువంటి ఒకటో రకం నావలను నిర్మించుటకు చాలా కాలం పట్టుతుంది వానిలో ఒక్కొక్కటి కోట్లకొలది ఖరీదుగలది ఒక్కొక్క పెద్ద యుద్ధనావ మునిగినదంటే—కొన్ని కోట్ల ద్రవ్యం నష్టమైనట్లే ఇవిగాక, వీటికన్న చిన్నవి డెస్ట్రాయరు నావలనేవి సుమారు 125 వరకు జపానుకు ఉంటాయి వీటిమీద ఉండే ఫిరంగులు 6 అంగుళాల ఫిరంగులు, లేదా 8 అంగుళాల ఫిరంగులు మాత్రం ఉంటాయి క్రూయిజరు నావలు జపా

నుకు సుమారుగా 30, లేదా 40 వరకు ఉండవచ్చును. ఇవిగాక, విమానాలను ఎక్కించుకొని తిరిగేటటువంటి విమానవాహకనావలు కూడా ఉన్నాయి ఈ విమాన వాహక నావలు జపానువాళ్లకు సుమారు 10 ఉంటాయి మరొక అరడజనుకూడా తయారు చేసుకొన్నారని అంటారు ఇవిగాక, జలాంతర్గములు ఉన్నాయి. అవి సుమారొక 100 ఉండవచ్చు జపాను వాళ్లకు ఉన్న యుద్ధ నౌకాబలం అంతా ఇదే

అయితే, ఒక్క ముఖ్యవిషయం ఆలోచించాలి. ఇంగ్లాండుకు ఉన్నంత నౌకాదళం జపానుకులేదు. నౌకాదళం విషయంలో అమెరికా వారితోకూడా జపాను పోటీకి నిలువలేదు అయినప్పటికీ, అటువంటి ఇంగ్లాండు మీదను, అమెరికామీదను జపానువారు సవాలుచేసి యుద్ధం ప్రకటించారు.

జపానుకు రాజ్యాలు జయించాలని ఎంత కాంక్ష ఉన్నప్పటికీ, తన దగ్గరఉన్న పెద్దరకం యుద్ధ నావలను తనకోస్తా విడిచిపెట్టి దూరప్రాంతాలలో యుద్ధంచేయుటకై పంపించలేదు. ఎందుచేతనంటే, జపాను రాజ్యాన్ని రక్షించుటకొరకై ఆ పెద్ద యుద్ధ నావలు జపాను కోస్తాలోని రేవులలో తప్పనిసరిగ ఉండాలి అందువల్ల ఆ పెద్ద యుద్ధ నావలను బయటికి పంపడంలేదు అదిన్నీగాక, అవి ఒక్కొక్కటి కోట్లకొలది ఖరీదుచేస్తాయి ఒక్కటి మునిగితే చాలు, తిరిగి యిప్పట్లో మరొక పెద్ద నావను కొత్తగా జపానువారు నిర్మించుకోలేరు వీలైనంత తక్కువ నష్టంతో యుద్ధం చేసి, తక్కువ ఖర్చుతో ఎక్కువ రాజ్యం జయించాలనే తత్వం జపానువాళ్లకు ఉన్నది అందువల్ల యింతవరకున్నూ జపానువారు యీ సంగ్రామంలో తమకుగల పెద్ద రకం ఒకటో రకం యుద్ధ నావలను తీసికొనివచ్చి సముద్ర సమరం చెయ్యలేదు అమెరికావారి యుద్ధ నౌకాదళంతో కోరలు సముద్రంలో ఒక పెద్ద యుద్ధం జపానువారు చేసారు మిడ్వే దీవులవద్దకూడా మరొక పెద్ద యుద్ధంచేసారు కాని, యీ రెండు నౌకా యుద్ధాలలోను, జపానువారు తమకుగల విమాన వాహక నావలనే తీసికొనివచ్చారు ఈ నావల మీదఉండే జపాను విమానాలు వెళ్లి అమెరికను నావలమీద బాంబులువేసి యుద్ధంచేసినవి ఈ నావల వెంట కొన్ని డెస్ట్రాయిర్లు క్రూయిజర్లు మాత్రంవచ్చి యుద్ధంచేసినవి. కాని, యీ సముద్రయుద్ధములో యీ జపాను క్రూయిజర్లున్నూ డెస్ట్రాయిర్లున్నూ చాలా గంగపాలైనాయి అన్నింటికన్నా ముఖ్యమైన విషయమేమిటంటే, జపానువారు యీ సముద్ర యుద్ధాలలోనికి తీసికొనివచ్చిన విమానవాహకనావలు చాలా నష్టమై మునిగిపోయినవి. మిడ్వే దీవుల యుద్ధంలోను కోరలు సముద్ర యుద్ధంలోను జపానువారివి 6 విమాన వాహక నావలు మునిగిపోయినవి. మరొక 6 విమానవాహక నావలు పనికిరాకుండా ధ్వంసమైనవి. ఇటువంటి విమాన వాహక నావలు కొలదిగానే వారికి మిగిలిఉన్నాయి. ఈ విమాన వాహక నావలనే తీసికొనివచ్చి, వీటి మీదఉండే విమానాలను అమెరికను నావలమీదకు పంపించి, బాంబులువేసి ఇంతవరకూ జపానువారు సముద్ర యుద్ధంచేసారు కాని, యీ విమాన వాహక నావలు చాలావరకు నష్టమైనందువల్ల, ఇక, గతిలేక, విధిగా, తమ పెద్దరకం యుద్ధ నావలను సముద్ర రంగంలోనికి వారు తీసికొని రావలసిన స్థితివచ్చింది అటువంటి స్థితిలోకి జపానువారిని తీసికొనిరావలెననే ఉద్దేశంతోనే, జపానువారి విమాన వాహక నావలను అమెరికను నౌకా దళాధిపతియైన అడ్మిరలు నిమిట్జు గారు పట్టుదలతో ముంచివేసారు ఆయన కోరినట్లుగానే, మొన్న సాలమను దీవులవద్దకు జపాను వారి పెద్దరకం యుద్ధ నావలువచ్చాయి సాలమను దీవులలో దిగిన అమెరికా సేనలను అచటి నుండి వెళ్లగొట్టి ఆ దీవులను తామే పూర్తిగా ఆక్రమించవలెననే సంకల్పంతో గొప్ప జపాను యుద్ధ నౌకాదళ మొకటి సాలమను దీవులవైపుకు పంపబడినదని ఇటీవల వార్తలువచ్చాయి ఆ జపాను నౌకాదళములోని రెండు పెద్దరకం యుద్ధ నావలమీద అమెరికను విమానాలు బాంబులు వేయగా, ఆ పెద్ద యుద్ధ నావలకు బాంబు దెబ్బలు తగిలినవనే వార్త అటుపిమ్మట వచ్చింది గతవారం సాలమను దీవులవైపుకు వచ్చిన జపానువారి పెద్ద నౌకాదళము అక్కడనుంచి వెళ్లిపోయినదని నిన్న తిరిగి వార్తవచ్చింది కాబట్టి జపానువాళ్లు పెద్దరకం యుద్ధ నావలను గొప్పగా వెంటబెట్టుకొని ఆ మహాసముద్రంలో విహారం చెయ్యవలసిందేగాని, సముద్ర సమరం సాహసించి చెయ్యలేకుండా ఉన్నారు అవి నష్టమైపోతాయనే భయం జపానువారికి పూర్తిగాఉంది. జపానుకు యీ వరకే, చాలా డెస్ట్రాయిర్లు, క్రూయజర్లు, రవాణా నావలు, విమాన వాహక నావలు, గంగాప్రవేశం అయినాయి. ఇక పెద్ద

# " బెవిను బాయిసు. "

## పూర్వంకన్న $2\frac{1}{2}$ రెట్లు అధిక జీతం.

ఇండియానుండి పనివారిని తీసుకపోయి ఇంగ్లాండులో యుద్ధ కర్మాగారములందు శ్రద్ధగ శిక్షణయొసంగి నేర్పరులను చేసి పంపుటచే బెవిను స్కీము ప్రకారం ఇండియాలో నొక క్రొత్త తరగతి కార్మికులేర్పడిరి " ఇంగ్లాండు పోయి వచ్చిన " యీ భారతీయ యువకులు అదివరకు గణిస్తున్న జీతాలకన్న 2½ రెట్లు అధికంగా సంపాదించుకొంటున్నారు

'ఇప్పటికి తిరిగివచ్చిన' బెవిను బాయిసు 122 గురిలో 105 మందికి క్రొత్త ఉద్యోగాలయి ఎక్కువ జీతాలు గడించుచున్నారు. మిగిలిన 17 గురు యిటీవలనేవచ్చేరు, వారికి పనులు కుదుర్చుటకు ఏర్పాటులు జరుగుచున్నవి. ఇంగ్లాండులో శిక్షణవలన వారి నేర్పు బాగా వెల్లడికాగానే బెవిను బాయిసుకి గిరాకీ యెక్కువగుతుంది

ఆ వచ్చినవారిలో కొందరిగూర్చి యిచట చెప్పనగును అదివరకు లాహోరులో ఫిట్టరుగానుండి నెలకు రూ 75 లు గడించుకొంటున్న వాడు యిపుడు ఒక ఆర్డినెన్సు ఫాక్టరీలో చార్జిమనుగా రూ 170 లు జీతంపై నియమించబడెను, 290 వరకు పెరుగగలదు. శింధులోని ఇంకో ఫిట్టరు రూ 70 లు జీతగాడు యింకో గవర్నమెంటు ఫాక్టరీలో రూ 170 లపై నియమించబడెను. అదివరకు రూ 65 లు తెచ్చుకుంటున్న మెకానిస్టు యిపుడు రూ 155 లు సూపరవైజరయినాడు బొంబాయినుండి వెళ్లిన రైల్వే ఫిట్టరు ఇంగ్లాండు పోకముందు రూ 140 లు జీతంగల్గి, యిపుడు విమానాల కర్మాగారమునందు అసిస్టెంటు ఫోరుమనుగ రూ 248 లు సంపాదిస్తున్నాడు బీహారులో అదివరకు రూ 75 లు తెస్తున్న టర్నరు ఫిట్టరు యిపుడో రైల్వే వర్కుషాపులో రూ 200 లపై చార్జిమనుగ నియమింపబడెను

మదరాసులో రోజుకి రూ 2 లు పుచ్చుకుంటున్న ఇంప్రూవరుకి ఇంగ్లాండుపోయి వచ్చినాక, ఇండియను ఇంజనీరు కోరులో కమిషను ఉద్యోగం దొరికింది

ఇంకో మదరాసు ఇంప్రూవరుకి రూ 200 లు జీతంపై చార్జిమను ఉద్యోగం దొరికింది. పంజాబులో రైల్వే వర్కుషాపునందు కాపరుస్మిత్తుగా రూ 35 లు తెస్తూవుండినవాడు యిపుడు ఒక ఫాక్టరీలో రూ 200 లు ఫోరుమనుగా నున్నాడు.

బెంగాలులో రూ 22 లు ఫిట్టరుగ నుండినవాడు మిలిటరీ ఇంజనీరింగు సర్వీసులో రూ 130 లు తెచ్చుకుంటున్నాడు బెంగాలులో రూ 45 లు జీతంపై నుండిన వెల్డరు యిపుడు విమానాల కర్మాగారంలో అసిస్టెంటు ఫోరుమనుగా రూ 165 లపై నియమింపబడెను.

మిగిలినవారు మిలిటరీలోను, రాయల్ ఇండియను నేవీయందును చేర్చుకొనబడిరి

బెవిను బాయిసు అందరుగూడ ఇండియాకు తిరిగివచ్చినాక తిరిగి ఉద్యోగాలు సంపాదించుటే గాక, ప్రాత జీతాలకన్న చాల యెక్కువ సంపాదించుచున్నారు. ఈ స్కీములో చేరుటవలన వారు ప్రభుత్వోద్యోగులైపోరు, అంతకన్న వారికి ఉద్యోగాలు యిచ్చి తీరాలను పూచీ ప్రభుత్వంవారుంచుకోరు, కాని ప్రతివానికి తగిన ఉద్యోగం సంపాదించుటకు ప్రయత్నాలు జరుగును.

---

రకం యుద్ధ నావలుకూడా సముద్రస్నానం చేసినట్లయితే, జపాను రాజ్యాన్ని రక్షించగల యుద్ధ నావ లిక జపానుకుఉండవు జపాను దేశం దిక్కులేని దీనావస్థలో ఆ శాంత మహాసముద్రం లోని అబలవలె దిసమొలతో నిలువబడి, చేతులు పైకెత్తి తూర్పుగనున్న అమెరికావైపు తిరిగి నమస్కారంచేసి శరణు వేడవలసివస్తుంది అటువంటి స్థితికి జపానును తీసికొని రాగలందులకై అమెరికావారు ఆ పసిఫిక్కు మహాసముద్రంలో ఆయువుపట్టుగా ఉన్న సాలమాను ద్వీవులలో పీఠం ఏర్పరచుకొని కూర్చున్నారు పొన్నమాను ఎక్కినట్లుగా సాలమానులో చేరింది అమెరికా సేన. జపాను నావలు ఆ చుట్టుప్రక్కల నున్న సముద్ర ప్రాంతంలోనే జలక్రీడలు చేస్తున్నాయి కొన్ని మునుగుతున్నాయి కొన్ని తేలుతున్నాయి. జపాను యుద్ధ నావలు సాలమాను వైపుకు కన్నులెత్తిచూచి, ఒడ్డుకు రాలేక, ఏమీ చెయ్యలేక, " ఎంతపని చేసితివి కృష్ణా ' " అన్నట్లుగా అమెరికనులు చేసిన పనికి ఆశ్చర్యపడి, " ఏదీ గతినాకూ ' రంగా ' రంగా ' " అని ఆ జపాను యుద్ధ నావలు, అమెరికా వైపు తూర్పుగా తిరిగి నమస్కారం చేస్తున్నాయి ఎదురు జవాబు చెప్పలేక అదరి బెదరి తిరిగెడి తలోదరివలె చాటుమాటు సముద్ర జలకేళీ విహారం చేస్తున్నాయి.

## ఇండో-చీనాలో జపాను దౌర్జన్యం

ఇండో-చీనాయందు ప్రజల అభిమానం సంపాదించుటకు జపానువారుచేసిన యత్నం విఫలమై, అచట జపాను ప్రతికూలభావం పెచ్చు పెరిగింది.

జపాను సేనలు మొదట ఆ దేశంలో ప్రవేశించినపుడు రిక్షా చార్జీలు రెండింతలిచ్చి, సిగరెట్లు ఊరికే పంచిపెట్టి ప్రజలను వశపరచుకొన చూచినపుడు, దేశీయులు కొంత సుముఖులుగ నుండిరి. కాని అధికంగా జపాను సేనలు రాగానే యీ సద్భావం పోయింది చాలమంది ప్రజలను నిర్బంధంగా సేవలోకి దింపుచున్నారు కనీసవేతనాలిచ్చి రెండింతల పనిచేయించు కొంటున్నారు ఉత్తర కొసనుండి దక్షిణకొసవరకు కూలీలను రైళ్ల నిండానింపి తీసుకపోవుచు, కుటుంబాలకు దూరం చేసి, తగిన సదుపాయాలివ్వక కఠినంగా పని చేయించుకొనుచున్నారు

హైపాంగునందు జపానువారికి తగినంత మంది కూలీలు యిష్టపడివచ్చిన వారగుపడలేదు. అందుచే మిలిటరీ సిపాయీలను పంపి బ్యాండుతో మంచి పాటలుపాడించి, వినడానికి జనం ఎక్కువ మంది చేరగానే, సైనికులు వారిచుట్టు కాపలా కాచిరి. తరువాత వారందరిని బలవంతంగా రైల్లోపడేసి తగిన కాపలాతో తీసుకపోయిరి ఆ రైలు హానాయిచేరక ముందు ఒక పెద్ద ఫ్రెంచి ఉద్యోగి దాన్ని నిలిపివేసెను చాల సేపు తీవ్రముగ వాదించిన పిమ్మట జపానువారు రైలుని తిరిగి హైపాంగు తీసుకపోయి ఖైదీలను విడిచివేసిరి

## టర్కీ—సంయుక్త రాజ్యాలు.

"యుద్ధ సమయమునందు, యుద్ధానంతర పునరుద్ధరణ కార్యమునందుగూడ రాజకీయ సైనికార్థిక విషయములన్నింటియందు టర్కీ సంయుక్త రాజ్యాలపక్షమే యుండును" అని అంకారా నుండి న్యూయార్కు టైమ్సు విలేఖరి వ్రాసెను

"అంతేకాక టర్కీ ప్రభుత్వ పెద్దలు మిత్ర మండలి విజయం పొందేవరకుగూడ తమ దేశం మధ్య ప్రాచ్యరంగమున పెద్ద రక్షణ శిబిరంగా నుండగలదని నమ్ముచున్నారు

"టర్కీ సర్వదా ఆయుధాలతో తయారుగ నుండి తాటస్థ్యం వహించి యుండగలదు టర్కీ గౌరవమునకు భంగకరంగానుండు అన్య సందేశాలు వచ్చినను లేదా యితర దేశ సైన్యం పైబడినను తప్ప, టర్కీ ఇంగ్లాండుతోగల సఖ్యత ఒడంబడికకు విరుద్ధంగాకుండాను, జర్మనీతో సఖ్యత చెడకుండాను ప్రవర్తింపగలదు ఇతరులు దురాక్రమణకు గడంగినచో ప్రాగ్పశ్చిమ ఖండాలు రెండింటికి మధ్యగనుండి చాల ముఖ్య స్థానము వహించియున్న టర్కీ, వారిపై కత్తి కట్టక మానదు" అని ఆ విలేఖరి వ్రాసెను

## జపానులో జర్మనులపై ద్వేషం.

టోకియోనుండి ఇటీవలనేవచ్చిన ఆంగ్లేయు డొకడు యిట్లు తెలిపెను :—

"జపాను దేశమంతటను జర్మనీకి ప్రతికూల భావం పెరుగుచున్నది తమ దేశంలో జర్మనులను ఎక్కువగ హిట్లరు దింపిననాటనుండి యిది ప్రారంభమయింది ఆవచ్చిన నాజీలందరు గూఢచారులని పంచమదళం సభ్యులని జపానువారికి తెలుసు నేడు జపాను జైళ్లలో రాజకీయ కుట్రలకై శిక్షనొందుచున్న విదేశీయులలో జర్మనుల సంఖ్యయే యెక్కువ

"హిట్లరువ్రాసిన మీనుకెంఫ్‌నందు జపాను వారిని మానవజాతికన్న నీచులుగ వర్ణించెనని విద్యావంతుడగు ప్రతి జపానీయునకు తెలుసు. హిట్లరు యీ యుద్ధంలో గెలుస్తే తమ సామ్రాజ్యాన్ని నిలపెట్టుకోడానికి తాము జర్మనీతో యుద్ధం చేయవలసియుంటుందని ఒక జపాను ఉద్యోగి నాతో అనెను ఈ యుద్ధంలో జపాను దిగుట హిట్లరు కోర్కె ప్రకారంకాదు. కాని ఒకటిమాత్రం గమనింపవలసియుంది. జపాను యుద్ధంలో దిగిననాడే హిట్లరు రష్యాపై దాడి నిలిపివేసెను జర్మను-జపాను సఖ్యతచెడుటకు యిదో కారణం. హిట్లరు తమను మోసం చేయునని జపానువారికి యిందువలన అనుమానం కలిగింది.

"నాజీల అహంకారాధికార వైఖరికూడ యీ ద్వేషాన్ని పెంచింది. జపానులో ఎప్పుడూ విదేశీయ సలహాదారులుండనే యుంటారు జపాను వారి సలహా గైకొనుట కిష్టపడును కాని నాజీల వలె అధికారం చెలాయిస్తామంటే మాత్రం సహించరు జర్మనులు అనేక విందులుచేసి విశేషంగా జపానులో ఖర్చుచేస్తున్నారు కాని చాల కొద్దిమందినే మిత్రులను సంపాదించేరు.

# రాయలు విమానదళ చర్యల సమీక్ష.

సెప్టంబరు 20 వ తేది ఆదివారం రాయలు విమానదళం వార్షికోత్సవ దినంగా ఎంచి, ఢిల్లీ చర్చిలో వైమానికోద్యోగులకొరకు సైనికులకొరకు ప్రార్థనలు జరిగినవి 1940 వ సం॥ సెప్టంబరు 15 వ తేదిన ఇంగ్లాండుపై జర్మను విమాన దాడిలో, 185 శత్రు విమానాలు పడగొట్టబడినవి. దాని గౌరవార్థం యివుడీ ఉత్సవం జరిగెను.

ఈ నెల (సెప్టంబరు) 15 దినాలలో రాయలు విమానదళం బాంబరులు జర్మనీపై పదిసార్లు పెద్ద దాడులు జరిపినవి. ఈ దాడులలో రాయలు విమానాలు 91 మాత్రం పడిపోయినవి రెండేండ్ల క్రిందట శత్రువు ఇంగ్లాండుపై దాడిచేసినపుడు యీ పదిహేను రోజులలోనే 696 విమానాలను గోల్పోయెను ఈ నెల మొదటి పక్షంలో జర్మను విమానాలు ఇంగ్లాండుపై వచ్చినవి 10 కూల్చబడెను దీనిబట్టి ఇంగ్లాండుపై దాడికన్న జర్మనీపై దాడి తీవ్రంగానుందని తెలియగలదు

జర్మనులు ఇంగ్లాండుపై విమానదాడి చేయగ సివిలు ప్రజలు సగటున నెలకు యీ దిగువ రీతి చనిపోయిరి.

| | |
|---|---|
| 1940 | 3,869 |
| 1941 | 1,647 |
| 1942 | 325 |

1940 సెప్టంబరులో 6,955 సివిలు ప్రజలు చనిపోయిరి, యీ నెలలో 403 మాత్రమే

గత మూడేండ్లలో రెండు దేశాలకు యీ దిగువ రీతి నష్టంవచ్చింది చదువరులే తైఫారేసి చూసుకోవచ్చును. విమానశాఖ మంత్రి కార్యాలయంవారు యీ సంఖ్యలు తయారు చేసిరి —

| | శత్రువుల విమానాలు. | రాయలు విమానాలు |
|---|---|---|
| 1939-40 | 1,549 | 383 |
| 1940-41 | 2,080 | 501 |
| 1941-42 | 286 | 7 |
| | 3,915 | 891 |

1941 లో జర్మను విమానాలు తూర్పున రష్యాపైపోయి బ్రిటనుపై దాడి తగ్గించినవి. అందుచే అప్పటినుండి రాయలు విమానాలు దాడులు హెచ్చుచేసినవి స్వరక్షణయందుకన్న పురోగమన దాడులందు ఎక్కువ నష్టం కలుగుట సహజము. ఫ్రాంసు పడిపోయినాక బ్రిటిషు దాడులు ఎక్కువయినవి. అందుచే 1939-40 లో బ్రిటిషువారి నష్టం జర్మను నష్టంలో 2/3 వంతుండెను, 1940-41 లో శత్రు నష్టంకన్న రెండింతలు, మూడోయేట మూడింతలైంది

పడమటి యూరోపులో నష్టాల సంఖ్యలు యిట్లున్నవి —

| | శత్రువులవి. | బ్రిటిషు |
|---|---|---|
| 1939-40 | 1,082 | 671 |
| 1940-41 | 662 | 1,173 |
| 1941-42 | 744 | 1,993 |
| | 2,488 | 3,817 |

విమాన యుద్ధం—బ్రిటిషువారి సౌకర్యం.

నాల్గోయేడు యుద్ధంలో విమాన యుద్ధమునందు బ్రిటిషువారికి ఎక్కువ సౌకర్యములుండును అమెరికావారి ఎగిరే కోటలు ఇంగ్లాండు వచ్చియున్నవి శత్రు రాజ్యంపై తరుచుపగలే దాడిచేస్తూ 100 టన్నుల బాంబులు పడవేస్తున్నాయి అమెరికానుండి వచ్చిన ప్రథమ విమాన జట్టుయిది. ఇంగ్లాండులో 150 విమానాశ్రయాలను అమెరికా విమానదళం ఆక్రమించనున్నది ఈ నెలలో కనడా బాంబరులు మొదటిసారి 8 వ తేదిన, తరువాత 13, 14 తేదీలందు జర్మనీపై దాడి చేసినవి కానడా విమాన దళాలు 40 ఇంగ్లాండులో స్థావరముండును

ఇంగ్లాండు, అమెరికాల కర్మాగారాలందు యిపుడు నెలకు 7,500 విమానాలు తయారగుచున్నవి అంటే మన విమానశక్తికి నెలకు సుమారు 5,000 అధిక విమానాలు చేరుచున్నవన్నమాట జర్మనీపైని, జర్మనీ ఆక్రమించిన యూరోపుపైని విమానదాడికి యీ శక్తి అంతా వినియోగించబడును.

# యుద్ధం భోగట్టాలు.

## దక్షిణ ఇండియానుండి యుద్ధం సరకు సరఫరా.

యుద్ధానికి కావలసిన సరకులు తయారుచేయించుటకు చేతి పరిశ్రమల సహాయంకూడ పొంది వాటిని ప్రోత్సాహించుటకు దక్షిణ ఇండియా సర్కిలు సప్లయిసు కంట్రోలరుగారు మదరాసు పరిశ్రమలు వాణిజ్య జాయింటు రిజిస్ట్రారుగారివద్ద రూ 9 లక్షల విలువగల వస్తువులు వచ్చే నాలుగు నెలలలోగా కొనుటకు నిశ్చయించిరి గొడ్డళ్లు, చేతి పనిముట్లు పిడులు, కుర్చీలు, బెంచీలు మున్నగునవి, కత్తులు, బకిల్సు, యితర లోహపు వస్తువులు, కప్పియుంచే వలలు మున్నగునవి కొన దలచిరి

ఈ రాష్ట్రంలో తయారుచేయించుచున్న చేనేత వస్త్రముల ఆర్డరు అనేక లక్షల విలువగలది యిందు చేరలేదు

* * *

## అరబ్బీ పత్రికలు నాజీతత్వమును ఖండించుట

అరబ్బీ పత్రికలు జర్మను నాజీతత్వమును సర్వదా ఖండించుచున్నవి అల్‌ముంతఖీకు పత్రిక "అరబ్బులు మిత్రులు" అని ప్రధాన వ్యాసము వ్రాయుచు ఇస్లాము ప్రాంతమునందే ప్రజా ప్రతినిధి సూత్రములు యిమిడియున్నందున డెమాక్రటికు ప్రభుత్వ విధానం ముందుగ అనుసరించింది అరబ్బులే యని వ్రాసెను ఇతర స్వతంత్ర రాజ్యాలవారు యీనాటికి హిట్లరుచేత తమ హక్కుల నిరోధమును తమ విజ్ఞాన విధ్వంసమును అనుభవించుచున్నారు కాని, అరబ్బులు వినాడో అబ్దుల్ హమీదుగారిచేత అట్టి నిరంకుశత్వము అనుభవించియున్నారనెను

"అల్ అక్బరు" అను పత్రికలో యిట్లు ప్రకటింపబడెను—ప్రజాప్రతినిధి ప్రభుత్వాలుగల రాజ్యాలు యీ యుద్ధంలో గెలిస్తేనేగాని అరబ్బుల ఆశ లీడేరవు ప్రజా ప్రభుత్వ విజయయే ప్రపంచ శాంతి చేకూర్చగలదు నాజీలు అరబ్బులను అణచివేసి, వారి సంపద దోచుకోజూతురు కావున మన రాజ్యాలను చీలదీయదలచు నిరంకుశ నియంతల చర్యలను ఖండింతముగాక "సావుతు అల్ షాబు" అను పత్రికకూడ యిట్లే వ్రాసెను అరబ్బుల తిరుగుబాటు గినం వార్షికోత్సవంనాడు, అరబ్బులు జ్ఞాపకముంచుకోవలసిందేమంటే, తమభవిష్యత్తు మిత్రమండల రాజ్యాల చెలిమిపైనే ఆధారపడియున్నది గాని, స్వాతంత్రానికి వేరుపురుగైన నాజీతత్వంలో కాదని

* * *

## బ్రిటిషు నౌకా నిర్మాణము.

బ్రిటిషు రేవులందు వర్తక నౌకలు నిర్మించుట మూడు నాలుగు నెలలలో పూర్తిచేయబడుచూ వుంది, వాటికి అమెరికాలో అయ్యే ఖర్చుకన్న తక్కువ ఖర్చగుచున్నది. అతి వడిగాబోవు పెట్రోలు పడవల భాగాలు ఇంగ్లాండులో తయారవుతున్నవి వాటితో ఆ పడవలు ప్రపంచమంతట నిర్మింపబడుచున్నవి.

అని వైసు అడ్మిరలు వేకువాకరుగారు నౌకాదళోద్యోగి అమెరికాకు రేడియో ఉపన్యాసంద్వారా తెలిపిరి.

"దేశంలోనున్న నౌకానిర్మాణ కార్మికులలో సుమారు సగంమంది మరమ్మత్తు పనిచేయుచున్నారు 23,000 పైగా యుద్ధ నౌకలకు మరమ్మతు జరిగింది 35,000 వర్తక నౌకలు మరమ్మతుచేసి పంపబడినవి ఈ పనంతా పైన శత్రుదాడి జరుగుచుండగా, దీపాలార్పివేస్తూవుండగా జరిగిన పని"

* * *

## రషియా క్రొత్త బాంబరు విమానం.

రష్యా విమానదళాధికారులు తమ బాంబరులను యిది వరకుకన్న దూరంగా పంపుచున్నారు శత్రుదేశంలో దూరపు భాగాలపైగూడ బాంబులు వేయగల్గుట టి బి 7 రకం బరువైన పెద్ద బాంబరు విమానాలవల్ల జరుగుచున్నది అది 120 అడుగుల వెడల్పు గల్గియుండును నాలుగు ఇంజనులు ఒకే పైరెక్కగల్గి 4 టన్నుల బరువు బాంబులను చాలదూరం వరకు తీసుకపోగలదు పైకప్పు ఎత్తుగ నుండును అందు ముందు, ప్రక్కన, కొననగూడ ఫిరంగులుండును రెక్కలలో కదిలే ఫిరంగులుకూడా ఉన్నవి వాటిని దూరంగానున్న వైమానికుడే మీటలద్వారా వాడుక చేయును. 1,300 హార్సుపవరు ఇంజనులు కలవు వాటిని చల్లగనుంచే యేర్పాటు గలదు

ఎ ఎన్ టుపలోవుగారు దీనిని కనిపెట్టి తయారుచేసిరి రష్యాలోనే తయారుచేయబడిన ప్రత్యేక లోహంతో నిది నిర్మించబడెను 13 సంవత్సరముల కృషి అనుభవంపై నిది తయారుచేయబడింది

* * *

## అమెరికా క్రొత్త బాంబరులు.

అమెరికాలో తయారగుచున్న ఎగిరేకోట బాంబరు, లిబరేటరు బాంబరులు యిపుడు జర్మనీపై దాడికొరకు మార్చి కట్టబడుచున్నవి. ఇవుడీ బాంబరు విమానాలు మోయగిల బాంబుల బరువుకన్న రెండింతలుపైగా యెక్కువ బాంబులను మోయుటకు వీలుగా మార్చబడును ఇపుడు నాలుగింజనుల బాంబరు 3½ టన్నుల బాంబులను తీసుకపోగలదు ఈ బరువు ఎక్కువచేయబడినను యిదివరకంత ఎత్తునకు ఎగురగలవు

'ఎగిరే కోట' లనబడు విమానాలు పశిఫికు సముద్రం దాటుటకై 4800 నుండి 6400 కిలో మీటరుల వరకు ఒకేసారి ఎగురగల్గునట్లు సృష్టించబడినవి ఇపుడు అధిక బాంబులకు స్థలంకొరకు పెట్రోలు స్థలం తగ్గించబడి దూర ప్రయాణం సగం తగ్గిపోయినా యీ మార్పు చెందిన విమానాలు జర్మనీ అంతర్భాగములకు, ఆక్రమిత ఫ్రాంసులోకి పోయి తిరిగిరాగలవు

## మద్రాసు పటాలములలో జనహాని.

వేర్వేరు తేదీలయందు మద్రాసు పటాలములలో యీ క్రింది రీతిగా జనహాని కలిగినదని తెలియజేయుటకు చింతిల్లుచున్నాము :—

| నెంబరు | హొదా | పేరు. |
|---|---|---|
| | **వైస్రాయి కమిషను ఉద్యోగులు** | |
| | **గాయపడినవారు** | |
| ఐ ఎం డి — | | |
| ఎం.ఇ/289 | జెమెదారు | కె.ఎస్ జె. శాస్త్రి. |
| | ఇతర తరగతులు | |
| | అదివరకు **యుద్ధ ఖైదీలుగ** ప్రకటింపబడి | |
| | **ఇపుడు** చనిపోయినట్లు తెలిసినవారు. | |
| మదరాసు సేపర్లు, మైనర్లు— | | |
| 16375 | సేపరు | ఆంతోనిముత్తు |
| 17575 | సేపరు | అప్పలసామి |
| 16215 | హవల్దార్ | ఆరోక్యసామి |
| 18316 | సేపరు | ఆరోక్యసామి |
| 18150 | సేపరు | బాచా |
| 18586 | సేపరు | చిన్నప్పన్ |
| 18529 | సేపరు | ఆర్ డానియలు |
| 17297 | నాయకు | దొరస్వామి |
| 1000 | ఊడ్చువని | ఎల్లిగాడు |
| 13900 | సేపరు | వి ఎస్. గణేష్ |
| 18012 | సేపరు | గ్యానప్రకాశం |
| 18523 | సేపరు | కృష్ణ పిళ్లె |
| 13552 | సేపరు | మాసిక్యం |
| 16050 | సేపరు | మునిసామి |
| 14796 | సేపరు | ముత్తుసామి. |
| 18296 | సేపరు | ఓమి ఎల్లయ్య. |
| 15014 | సేపరు | పాంజాలి |
| 14644 | సేపరు | పొన్నుసామి. |
| 14741 | సేపరు | రాజు. |
| 16818 | సేపరు | రాయప్పన్. |
| 16108 | నాయక్ | సుబ్రమని |
| 15192 | సేపరు | సుబ్రమనియన్. |
| ఐ ఎస్ సి — | | |
| 9351 | సిగ్నలరు | అబ్దుల్ అజీజు |
| ఎ/3850 | సిగ్నలరు | అబ్దుల్ హఫీజు |
| ఎ/1430 | సిగ్నలరు | అబ్దుల్ హఫీజు |
| 9726 | సిగ్నలరు | ఎన్ గోపాలసామి |
| ఒ/2580 | వంట | గోవిందను |
| ఎ/2670 | సిగ్నలరు | జి ఎన్ కరియప్ప |
| ఎ/1764 | పి/ఎల్./నా. | జి. కేశవ రావు |
| ఎ/3887 | సిగ్నలరు | కృష్ణను. |
| ఎ/1624 | నాయక్ | ఆర్. పెరుమాల్ |
| ఒ/2412 | ఊడ్చు | పుసిను. |
| ఎ/2681 | సిగ్నలరు | శంకున్ని నాయరు |
| ఎ/2671 | నాయక్ | టి.సి. సుబ్రహ్మణ్యం. |

| నెంబరు. | హొదా. | పేరు |
|---|---|---|
| ఐ హెచ్ సి — | | |
| హెచ్/185084 | వంట | బాబు. |
| 93330 | ఎ/సిపాయి | కె ఎ గోపాల్. |
| 63006 | నౌఖరు | మస్జిదాను. |
| హెచ్/186256 | 2/జి/ఊడ్చు | మునియప్ప |
| హెచ్/185250 | చాకలి | పలాండి కందప్ప. |
| ఐ ఎ ఒ సి.— | | |
| ఒ/31971 | ఎఫ్. సిపాయి | సి. ఎం బాబు నాయుడు. |
| ఐ జి యస్ సి — | | |
| జి ఎస్ ఎఫ్. | | |
| 18100 | మసాల్జి | జి దొరైస్వామి |
| 16 పంజాబు రెజిమెంటు— | | |
| 7301 | సిపాయి | కాలిదాను. |
| | చనిపోయిరి. | |
| ఇండియను ఇంజనీరు— | | |
| 50124 | | ఆండి |
| 49832 | హవల్దార్ | కాలిముత్తు సేవరు |
| ఆర్ ఐ వి యస్ సి — | | |
| ఎస్ ఆర్ / 768498 | లా/నా | బాలరాజు |
| ఎం టి /894047 | సిపాయి | ఎన్ బాలముత్తు. |
| 181583 | బెల్లొబాయి | గులాంఖాను స్నేక్ షా |
| ఎం.టి /948655 | సిపాయి | కందసామి. |
| ఎ పి.సి — | | |
| 187002 | బి.క్యు ఎం.హెచ్. | ఎస్ జానురత్నం. |
| 116709 | కార్తిక | కె. వెంకయ్య |

### బిరుదులు.

భారతీయ సైన్యంలో యీ దిగువవారు ఆఫ్రికా రంగమున 1941 వ సం॥ నవంబరునుండి 1942 వ సం॥ ఏప్రిలు 30 వ తేదిలోగా జరిగిన యుద్ధమున చేసిన ఘనాకార్యములకు వీరత్వమునకు మెచ్చి యీ దిగువ రీతి బిరుదు లొసంగబడినట్లు లండను గజెటులో 1942 వ సం॥ సెప్టంబరు 9 వ తేదిన ప్రకటించబడెను :—

ఎం.సి —

కెప్టను వేదాంత రంగాచారి, ఎం బి. బి ఎస్, ఐ ఎం ఎస్. మదరాసు సేపర్సు, మైనర్సు

ఐ.డి ఎస్ ఎం.—

| | | |
|---|---|---|
| 15342 | నాయకు | గోవిందను |

భారతీయ సైన్యం

డి ఎస్.ఒ.—

మేజరు కుమారమంగలం.

హిందూ దేశము ధృడముగా యుంటే
యీ ఆగ్రస శత్రువు యొక్క గతి యేమి!




దేశయుద్ధరంగమునందు చేరండి

MADRAS PRINTED AND PUBLISHED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS